# ఇంకా ఎన్నాళ్ళిలా?



పి.వి.కృష్ణారావు

# ఇంకా ఎన్నాళ్ళిలా?

పి.వి. కృష్ణారావు

ముఖచిత్రం మరియు లోపలి చిత్రాలు : డి. నటరాజ్



కవర్ డిజైన్ : గిరిధర్

కాపీలకు :
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్

**విశాలాంధ్ర బుక్ హౌస్**
అన్ని బ్రాంచీలలో

ప్రచురణ :
**బోధిసత్త్వ పుస్తకమాల,**
9-31-6/2, షణ్ముఖప్లాట్స్,
కూరగాయల మార్కెట్టు ఎదురుగా
పితాపురంకాలనీ, విశాఖపట్నం - 530 003
ఫోన్ : 0891 - 2509273

ముద్రణ :
శ్రీశ్రీ ప్రింటర్స్
విజయవాడ - 2
ఫోన్ : 9490634849

వెల : 30 రూ/-

for
Neil Mohan Kodali
&
Jey Krishna Kodali

with love and hope
that one day
you will ask me
for the meaning
of these few lines

# అన్వేషణ

బహిర్జగత్తు ఎంత విస్తృతమో, సంక్లిష్టమో అంతర్జగత్తూ అంతే. ఈ రెండింటి సమన్వయమే వ్యక్తి జీవితం. వారసత్వం (జీన్స్ : కాన్స్టిట్యూషన్, టెంపర్‌మెంట్, పొటెన్షియల్), తటస్థపడిన వ్యక్తులు, జీవన పరిస్థితులు వ్యక్తి జీవితానుభవాల్ని నియమిస్తాయి.

జీవితంలో ఎదురయ్యే నిర్ధారిత, యాదృచ్ఛిక సన్నివేశాల్లో వ్యక్తి ఎంపికల పాత్ర స్వల్పమే. ఆ ఎంపికలు జరిగేది అవి వరాలవుతాయో, శాపాలవుతాయో తెలియని స్థితిలోనే. అంతర్ బహిర్జగత్తుల పరస్పర చర్యలే మనిషి జీవితంలోను, బాహ్యపరిస్థితుల్లోను మార్పుకు పునాది. ఒక్కోసారి వాటిలో జరిగే ట్రాన్షఫర్మేషన్‌కి మన ఎంపికలే కారణం. కాబట్టే మనిషి చైతన్యానికి అంత విశిష్టత.

ఒక మనిషి ఆలోచనా రీతి అతని మేథమీద, లభ్యమైన సమాచార సంపద మీద, పొందిన జీవితానుభవాల మీద ఆధారపడి కొనసాగుతుంది.

నా జీవితాన్వేషణలో వెలువడిన ఈ మాటలు మీరు అన్వేషకులయితే, మీరు ఒంటరివారు మాత్రం కాదు అని చెప్పటానికే.

మనోవిజ్ఞానశాస్త్ర అధ్యయనం, విశ్వవిద్యాలయ అధ్యాపక, పరిశోధక వృత్తి, నా జీవితపు ఒడిదుడుకుల్లో తట్టుకోవటానికి నాకు అక్కరకు వచ్చాయి. ఇంతకు మించి నాకేమీ చెప్పేందుకు లేదు. ఇదీ ప్రచురణ కర్త నటరాజ్ మాటకాదనలేక.

ఈ రాతలు పుస్తక రూపంలో రావటానికి మొదలు, తుది, కారణం నటరాజ్ సంకల్పము, కృషి మాత్రమే. అతనిలోని చిత్రకారుణ్ణి ఇన్‌స్పైర్ చేసి ఈ సంకలనానికి అందాన్ని, లోతుని ఒనగూర్చినందుకు అతనికి నా కృతజ్ఞతలు. అందంగా ముద్రించిన శ్రీశ్రీ ప్రింటర్స్ వారికి కూడా....

– పి.వి. కృష్ణారావు
Phone : 0012814199135
e-mail : krishnaraopv2001@yahoo.com.

# ఇంకా ఎన్నాళ్ళిలా ?

◆

గతంలోకి చూస్తున్నాను
గతం నుంచి మేల్కొంటున్నాను.
నాలోని అవ్యక్త చైతన్యాన్ని తరచి
వర్తమానంలో ఇమడలేక
యత్నిస్తున్నాను గతంలో నిలచి
నాకు నేను అర్థంకాను
నాలోని లోకాలు అసలే అర్థం కావు
అయినా
ఫ్రాయిడ్ అడుగు జాడల్లో
యూంగ్ సిద్ధాంతాలతో
యాడ్లర్, రాంక్, సల్లివాన్,
ఇంకా, ఇంకా
మరెన్నో థీరీలను క్రోడీకరించి
నా విద్యాజ్ఞానాన్ని తరచి
చేతనం నుంచి అచేతనాన్ని
గతం నుంచి అనుభవాల నిజంలోకి
నన్ను నేను వెతుక్కుందామని
ప్రయత్నిస్తున్నాను, నేస్తం
ఏవో అగాధ తమోమయ లోకాల్ని
అణచబడ్డ జీవనవాంఛల్ని



కొద్దిగా పరికించగలుగుతున్నాను
వెలితిగా అర్థం చేసుకుంటున్నాను.
ఇగ్నోరెన్స్ ముద్దగా
జనని గర్భం నుంచి
ఆకలితో అరుస్తూ
ఆక్సిజన్ కోసం ఏడుస్తూ
ఉక్కిరి బిక్కిరిగా
ఒక్కసారిగా
పడ్డాను, నేస్తం ఈ లోకంలో
భయపడ్డాను, బయటి ప్రపంచాన్ని చూసి
వొక్కటిగా, వొక్కొక్కటిగా
అమ్మ కోపాన్ని
ఆమె కౌగిట్లో సెక్యూరిటీని తెలుసుకున్నాను
నాన్న నుంచి, నాతోటి వాళ్ళ నుంచి
నిజం నేస్తం, ఎంతో నేర్చుకున్నాను
కానీ బ్రతకటం నేర్చుకోలేకపోయాను
అందుకే త్రవ్వుతున్నాను
నా మస్తిష్కపు పొరల్ని
అనుభవాల అరల్ని
నా కలల్ని
అనుమానపు తెరల్ని
ఈ బ్రతుకు సమరంలో
ఈ ప్రాకులాటలో
ఈగో ఇంటిగ్రేషన్ కోసం

ఫీలింగ్ ఆఫ్ సెక్యూరిటీ కోసం
వెతుకుతున్నాను నేస్తం
విసిగిపోతున్నాను
నేను ఎదిగిన లోకంలో
నేను చదివే బడిలో, నా డిగ్రీల్లో
నేను పొందిన అనుభవాల్లో
నాకు సెక్యూరిటీ కన్పించలేదు
అందుకే నేస్తం, ఈ ఎనాలసిస్
ఈ లోకం
వీళ్ళ సాంప్రదాయాలు
కుళ్ళు, డబ్బు, కాంపిటీషన్
ఇవన్నీ
నా కాన్ట్సిట్యూషన్ మీద
నా ఈగోమీద
నా ఆశల ఆవేశాల మీద
దెబ్బతీశాయి, నేస్తం
అయినా, నిబ్బరించుకున్నాను
అమ్మఒడి వదిలెయ్యటంతో
మొదలయిన ఈ ఆరాటాన్ని
నా వివేకంతో వారించుకుంటూ
కలలు కంటూ, కుంటుకుంటూ
ఈ పాడు ప్రపంచంలో, ఇంకా ఎన్నాళ్ళిలా?

*'ఆంధ్రా యూనివర్శిటీ ఆర్ట్సు, కామర్సు, లా కళాశాల మేగజైన్, 1972*

## నవ్య గీతం

◆

రా నాతో ప్రియతమా,
ఐన్‌స్టయిన్ ఫైనిట్ విశ్వం
నిజంగా ఇన్‌ఫినిట్ కాదేమో చూద్దాం
కాంతి వేగంతో పయనిస్తే
కాలం స్తంభిస్తుందేమో పరీక్షిద్దాం
"స్రష్ట" సిద్ధాంతాన్ని కాదని
డార్విన్ పథంపైని
ధీమాగా సాగిపోదాం
కొత్తదారుల వెంట
సరికొత్త ద్వారాలు తెరుచుకొని
డైలక్టిక్స్ జీర్ణించుకొని
సృష్టిరహస్యాలు తెలుసుకుందాం
చిక్కుముడుల్ని విప్పుదాం
చైతన్యానికి, సమాజానికి
మానవతకి, మనుగడకి
మార్క్సు చెప్పిన అర్థాలు
ఆచరణలో తెలుసుకుందాం
రా చెలీ!
నాతో వచ్చి చూడు
చరిత్రలో దాగిన సత్యాల్ని
నాతో కలిసి తుడువు
కాలం చెక్కిలిపై కన్నీళ్ళని

*'విశాలాంధ్ర' 21-5-78*



## నువ్వు*

◆

నువ్వు మిస్టిక్
నీ చైతన్యం ఒక స్పెక్
విశ్లేషించి చూస్తే
అవ్యక్త చైతన్యం అందరిదీ ఒక్కటే
నీ ముసుగులో అన్నీ నీడలే
యుగాల గతం
నిన్ను శాసిస్తే
ఇన్‌సెస్ట్ భయాలతో
మానసిక జాడ్యాలతో
భవిష్యత్తు గురించి కలలు కంటావు
'మండలం'లోకి మరుగైపోతావు

* యూంగ్ సిద్ధాంతం

*'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' 14-7-78*



## నువ్వు *

◆

నిస్సహాయంగా పుట్టిన పాపానికి
ఇచ్ఛా శక్తులతో
న్యూనతల్ని అధిగమించటమే
నీకు భద్రత, ఆధిక్యత
నీ సృజనాత్మక జీవన శైలి
ఒక నిరంతర నిష్కృతి

* ఏడ్లర్ సిద్ధాంతం

*'ఆంధ్రసచిత్ర వారపత్రిక' 16–2–79*



## అసిధారా వ్రతం

◆

అంతర్బాహిర్జగత్తులకీ
చేతనావ చేతనలకీ
ఇడ్ సూపర్ ఈగోలకీ
మధ్య
జీవేచ్ఛకీ మృత్యేచ్ఛకీ
సహజాతాలకీ సంస్కృతికీ
వ్యక్తికీ సామాజికత్వానికీ
వాస్తవానికీ కాల్పనికతకీ
'ఈజ్'లకీ 'ఆట్'లకీ
మధ్య
జీవితం అసిధారా వ్రతం

*'ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక' అక్టోబర్, 1990*
*దీపావళి ప్రత్యేక సంచిక*



## మార్క్స్ - ఫ్రాయిడ్ - మార్కుసే

◆

తప్పిపోయిన ఆవులు
వేదాల్లో దొరకవు
చైతన్యం జాగృతమైతే
నిజాలు నీనుంచి దాగవు
కౌచ్ * మీది నుంచి లేచి
బారికేడ్లవైపు పరిగెత్తు !
(మరి బాలెట్ పెట్టె సంగతేమిటో)

* మనో విశ్లేషణలో ఉపయోగించే పడక్కుర్చీ

'ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక'
14-7-83



## సైకో ఎనాలసిస్ *

◆

విశ్లేషణ
వ్యక్తితో ఆగిపోతే
అది చికిత్స కాదు
చరిత్రని, సంస్కృతిని విశ్లేషించందే
రుగ్మత మాసిపోదు

* నియోఫ్రాయిడన్ల ప్రతిపాదన

'ఉదయం' 12-10-1990
నవతరం వారపత్రిక



## తొలిసారి అమెరికా

◆

దూరాన్ని కాలంతో కొలుస్తూ
కాలాన్ని గడియారంతో సర్దుతూ
అమెరికాలో అడుగు పెట్టాను
సంపన్నమూ, సుందరమూ అయిన ఈ దేశంలో
కళ్ళకి కనిపించే మనుషులకన్నా కార్లెక్కువ
రోడ్లపై వేగంగా జారే టైర్ల హోరు
ఈ దేశపు నాగరికత తీరు
పని, తిండి, వినోదం, విజ్ఞానం
విస్తృతంగా వివిధ రూపాల్లో
ప్రతి వూర్లోనూ
మనుషులతో పాటు
కార్లకీ స్మశాన వాటికలు *

( *Junk Yards)

'ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక' 7-10-83



## శృంగార స్వప్నాలు *

అనాది గర్భ ప్రశాంతత
అప్పుడప్పుడూ ఆందోళన
అంతా తెలుస్తూనే వుంటుంది
అయినా మెళుకువ వుండదు
మస్తిష్కపు పొరలు విడి
ఆ అగాధాల్లోంచి దూకుతాయి
అణచబడ్డ లైంగిక వాంఛలు
కాసేపు  వాస్తవపు సంకెళ్ళు విడి
కాలాన్ని, దూరాన్ని
నీతి, అవినీతుల్ని అధిగమించి
సంజ్ఞా మాత్రంగా -
గగన విహారాలు స్వారీ, సర్పాలు
రాజ ప్రాసాదాలు
సోపానాధిరోహణలు
మణిమాణిక్యాలు -
తృప్తిస్కలనాలు
అవచేతన అంచులు మెరిసి ఉరుములు, వాన
ఆ దారంట నువ్వు నడవగలిగితే
నీ చైతన్య ప్రక్షాళన

* *సిగ్మండ్ ఫ్రాయిడ్ స్వప్న విశ్లేషణ*

*'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' 6-7-79*



## ఫ్రాయిడ్

◆

మానవాళిని
కౌచ్ * *(Couch)* మీది కెక్కిస్తే
సర్వత్రా లైంగికత
మతం మానసిక రుగ్మత
సంస్కృతి సబ్లిమేషన్
వ్యక్తి జీవితం కాంప్రమైజ్

* సైకో ఎనాలసిస్‌లో ఉపయోగించే పడక్కుర్చీ

*'ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక' 30-12-77*



## నా దేశం

◆

నా దేశం
స్వాప్నిక ప్రపంచం!
స్థల కాలాల కొలతలుండవు
హేతు వుండదు
తర్కానికసలు తావే లేదు!
ప్రాచీనత, ఆధునికత
ఆధ్యాత్మికత, అవినీతి
పక్క పక్కనే
మనిషికొక న్యాయం
మతానికొక ధర్మం
అనుభూతికీ ఆలోచనకీ
మాటలకీ చేతలకీ
పొంతనుండదు
స్వీయవాంఛా పరిపూర్తి తప్ప
విలువలుండవు

*'ఆంధ్ర సచిత్ర వారపత్రిక' 4-1-91*



## నివేదన

◆

నీ శరీరాకృతి వర్ణించలేను
ఆ సౌందర్యాన్ని గూర్చి పాడలేను.
తోటి ప్రాణిగా, సాటి జీవిగా
ఓ స్త్రీ!
నువ్వెన్నడూ చూడబడలేదు
నువ్వు పురుషుడిలా మనగలగటం
ఆదర్శం అని నేనెన్నడు అనుకోలేదు
అయితే
లైంగిక రాజకీయాలతో
పాతాళానికి తొక్కి
గెలాక్సీలకి ఎత్తి
చరిత్ర నిన్నెప్పుడూ
వ్యక్తిగా చూడలేదని తెలిసి
నా కళ్ళు చెమర్చాయి



పురుష దౌష్ట్యంతో
సామాజిక కట్టడితో
నిన్ను
సెక్సువల్ ఇన్‌హిబిషన్స్‌కీ
భావ దారిద్ర్యానికీ
గురిచేశామని తెలిసి
నా రక్తం వుడుకెత్తింది
నా చుట్టూ వున్న నిన్ను చూసి
నీ శృంఖలాలు తెలిసి
నేను అనుకున్నాను
"నీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకి
ప్రికండిషన్ శ్రామికవర్గ విప్లవం' అని

*'విశాలాంధ్ర' 22-1-78*

## సైకో పాథాలజీ

◆

నీ జీవనగతిలో
అకస్మాత్తుగా కాదు, క్రమంగానే
ప్రవర్తనపై, ఉద్వేగాలపై, ఆలోచనలపై
నీకు పట్టుతప్పుతుంది.
నీలో అలజడి, అశాంతి, దిగులు, నిస్సహాయత
అది అందరూ గుర్తిస్తారు.
నిన్ను న్యూరాటిక్ అంటారు

ఒక్కోసారి ఆత్మరక్షణ కోసం
నువ్వు వాస్తవాన్ని విస్మరిస్తావు
ప్రాథమిక చింతనలు నిన్ను శాసిస్తాయి
లేనిది చూస్తావు, వింటావు
ఉన్నది కనపడదు, వినపడదు
నిన్ను సైకాటిక్ అంటారు

నీకు చికిత్స
మాటలతో, మందులతో



నీ దుఃఖాన్ని, నీలోని అపసవ్యాల్ని
తొలగించుకోవాలన్న తపనతో
నీ అనుభవాల్ని, అనుభూతుల్ని
నీనుంచి సైతం నువ్వు దాచుకున్న
నీ భయాల్ని, ఆశల్ని వెల్లడిస్తావు

క్రమంగా,
నువ్వేమిటో, నీ వ్యాధి ఎందుకో
తెలుసుకుంటావు
నీ కాన్స్టిట్యూషన్ని
బాల్యాన్ని, అవ్యక్త చైతన్యాన్ని
జీవన శైలిని, అనుభవాల్ని
నీ చుట్టూ వాళ్ళని
ఎంతో కొంత ఒప్పుకుంటావు
సమాధానపడతావు

ఈ ప్రపంచం ఒక ఆటస్థలం అని
అందరి బ్రతుకూ ఆటేనని
గెలుపు, ఓటమి
కేవలం నీ చేతుల్లోనే ఉండవని
సమాజంలోని నిజాలు, చట్టాలు
నీతి, ఆదర్శాలు
ఆ ఆటలో భాగమని

నువ్వు వాటన్నిటిని,
తోటి ఆటగాళ్ళని
ముఖ్యంగా నిన్ను నువ్వు
మరీ సీరియస్‌గా తీసుకున్నావనీ
అందుకే నీ మనస్సు అదుపు తప్పిందనీ
నీకు అర్థమవుతుంది.
మాటలు, మందులు
మార్పుకు ఊతమిస్తాయి

అలవాట్లని అధిగమిస్తూ
ఆలోచనల్ని, ఉద్వేగాల్ని, ప్రవర్తనని
అనుసంధానించుకుంటూ
నీ పయనం కొనసాగిస్తావు

నీలో ఈ మార్పుని కొందరు గమనిస్తారు
నిన్ను బాగుపడ్డాడంటారు
నీకు పిచ్చి కుదిరిందంటారు
ఎవరేమన్నా
సర్దుకుపొయ్యేదీ నువ్వే
రక్షించుకోవాల్సిందీ నువ్వే
ఈ ఆట మాత్రం ఆగదు

*'ఆంధ్రజ్యోతి డైలీ' 2006*

## వేవిళ్ళు

◆

ఆంటోజనీ ఆరంభంలో
చైతన్యపు అలజడి
పుట్టుకకు ముందే ముట్టడి
ముమ్ముందు అవసరమయ్యే ఓపికలకు
నేడే సమాయత్తం
అంతస్రావాల కల్లోలం
అమ్మ కడుపులో ఆర్భాటం
ఆమెకు పైకా

'ఆంధ్రజ్యోతి వీక్లీ'



పి.వి.కృష్ణారావు



inka ennallila ?
p v krishna rao



## రచయిత గురించి :

1947లో కృష్ణాజిల్లా లోని కూనపరాజు పర్వ గ్రామంలో ఒక మధ్యతరగతి రైతు కుటుంబంలో జననం. విస్సన్నపేట, ఏలూరు, విశాఖపట్టణాల్లో విద్యాభ్యాసం. 1970 నుంచి 2006 వరకు ఆంధ్రా యూనివర్శిటీలో - యూనివర్శిటి లైబ్రరీ, డిపార్ట్‌మెంట్ ఆఫ్ సైకాలజీ & పేరా సైకాలజీ, ఇన్స్టిట్యూట్ ఫర్ యోగ & కాన్షియస్‌నెస్ - వివిధ స్థాయిల్లో ఉద్యోగం.
పిల్లలకి దగ్గరగా వుండటానికని ప్రస్తుతం అమెరికాలో నివాసం.



## తెలుగులో ఇతర రచనలు :

నిత్య జీవితంలో ఒత్తిడి - నివారణ
(విశాలంధ్ర పబ్లిషింగ్ హౌస్)
ధ్యానం
(నవసాహితి బుక్‌హౌస్)
జ్ఞాపకశక్తి - చదివే పద్ధతులు
(నవసాహితి బుక్‌హౌస్)
స్వీయ భావన - వికాసం
(నవసాహితి బుక్‌హౌస్)
కొన్ని వ్యాసాలు, కథలు,
వివిధ పత్రికల్లో
రెండు నవలలు
'మనిషి కాటు',
'పునరంకితం'
ఆంధ్రజ్యోతి వీక్లీలో
వేములపల్లి మోహనరావుతో
కలిసి.











## ఇంకా ఎన్నాళ్ళిలా?

గుప్పెడు కవితలే.
ఈ గుప్పెట్లోనే
అనంత మానవ జీవితాన్నీ,
భవిష్యత్తునూ కారుమబ్బుల్లో
మెరుపు తీగల్లా
దర్శింపచేశారు
కృష్ణారావు గారు
మనసుల్నీ దేహాల్నీ
బతుకుల్నీ తీవ్ర శోధనతో
గాఢవిశ్లేషణ చేశారు.
మనకు అద్భుతమైన
ఫలితాలనందించారు.
వీటిల్ని కవితలనడం కంటే
సుషుప్తిని వెలిగించే దీపాలనవచ్చు
వీటిని చదివితే 'అధైర్యం, భయం,
స్వార్థం, కామేచ్ఛ, పలాయనత్వం,
పరపీడన, ఆత్మపీడన,
రెండు నాల్కల తత్త్వం.... ఇవన్నీ
అంతరంగంలో ప్రశ్నకు పెట్టబడతాయి
పరిశుద్ధమై విముక్తి చెందుతాయి.
వ్యక్తి ఆంతర్యం మార్పుకోసం తపించిపోతుంది.
మరింత ఆశావహ దృక్పథం కోసం
అతడు పరుగులు తీస్తాడు.
కొంచెం సావధానంగా వెతికితే
అదీ దొరుకుతుందిందులో ఇంకేం కావాలి?
ప్రశ్నలు వేసుకుందాం అందరం మన గురించీ లోకాన్ని గురించీ
ఇంకా ఎన్నాళ్ళిలా? మంచి ఎంపికలతో మంచి మార్పుల్ని
స్వయంగా నిర్మించుదాం స్వాగతించుదాం

- బోధిసత్త్వ పుస్తకమాల
విశాఖమహానగరం.